# శ్రీరాజరాజేశ్వరీశతకము

ఇందుమతి

శ్రీ సుజనరంజనీముద్రాక్షరశాల :— రాజమండ్రి.

# శ్రీరాజరాజేశ్వరీశతకము.

శా. శ్రీరాజిల్లుసమగ్రవైభవపరి ♦ స్ఫీతంబునౌ పాతగుం
టూరీపట్టణవాసిసాధువరదుం ♦ డున్నన్నగోపాలుఁడీ
శ్రీరాజేశ్వరికగ్రజాతుఁడగుటం ♦ జింతింతుజిత్తంబునన్
శ్రీరాజేశ్వరి కేనొసంగెడుకృతిం ♦ జెల్వొందరక్షింపఁగన్॥

క. అక్షీణకృపారసమయ
వీక్షణములు నాపయినను♦ వేడ్క జిలికి యీ
నక్షత్రమాలికాకృతి
రక్షింపఁగ గోపబాలు ♦ రహి నుతియింతున్॥

శా. నతితో నర్పణసేయ నెంచితిని యీ ♦ నక్షత్రమాలం బ్రియో
న్నతి రాజేశ్వరి దాల్చి సుంజాలవచో ♦ న్నత్యంబుదా నిచ్చు శ్రీ
పతి నేఁ జేసెడు సత్ప్రయత్నమును సా ♦ ఫల్యంబుఁగాఁ బ్రోచి స
మ్మతికీర్తిస్సుఖసంతతిస్సుజనస♦ న్మాన్యత్వమున్నిచ్చెడున్॥

గీ. అఖిలసురమౌళి మణిఘటి ♦ తాంఘ్రియుగళు
దనుజనాయకగర్వాంధ ♦ తమసభాను
మాల్యశైలనృసింహు నె ♦ మ్మదిఁదలంతుఁ
దలప మాకెయ్యెడల సిద్ధ ♦ దైవమగుట॥

శ్రీరాజేశ్వరి నీదుపాదయుగముం ♦ జింతింతునాదిత్తమం
దే రాజిల్లవసించుమమ్మ! సుజనౌ ♦ ఘేడ్యాసుధావేళల

శ్రీగా జెల్లెడు సూక్తులిమ్ము! సుఖసు ♦ శ్రీరాయురారోగ్య
ముల్
సూరిస్తుత్యయశంబు నిమ్ము దయతో ♦ సువ్యక్తశీలా!
యుమా॥

క. ధనవంతురాలఁగా నో
ఘనవేణీ నీదుకంబు ♦ కంఠంబునకున్
ఘనరత్నహారమీయక
గొనుమీ వాక్యార్థమాల ♦ గొప్పఁగ తల్లీ!

క. నక్షత్రమాల నొసఁగెద
నక్షీణకటాక్ష వీక్ష ♦ నామృతము దయన్
ప్రోక్షింపుము నా యత్నము
తక్షణమున నే ఫలించు ♦ తత్త్వార్థమయీ॥

క. నక్షత్రమాలనొసఁగఁగ
నక్షీణపద్మమున మొక్క ♦ నాత్మఁదలంచితిన్
నక్షీణకరుణతో నా
వక్షంబున నిల్వుమీవు ♦ భారతిశ్రోదరీ॥

ఉ. సారెకుఁ బ్రస్తుతింతు నను ♦ శారద నీరదపారదేందు క
ర్పూరతుషారతుల్యరుచి ♦ పూరితగాత్ర పవిత్రవాణి నా
భారతి నాముఖాబ్జమున ♦ బాయక నిల్చి మరందతుల్యవా
గ్పూపరములొల్క నాజతన ♦ ము న్సఫలంబుగఁ జేయుఁగా
వుతన్॥

గీ. ప్రణుతి జేసెద నాచిత్త ♦ పంకజమున
విఘ్నపతి విఘ్నవికాల ♦ పుత్రు గౌరి

పుత్రినాయత్నము సఫలం • బుగ నొనర్చి
నాదు జింహాగ్రమందున • నవమరంద
సమమధుర వాక్య సంపద ల్జాలనొసంగ॥

— • ధ్రువ కోకిల • —

త్రిపురసుందర కాండ వేశ్వర • దేవదేవ దయానిధే
త్రిపురదానవగర్వభంజన • దేవనాయకరంజనా
కృపను నాపయి నీకటాక్షము • వృష్టి వేగురిపింపవే
యిపుడు నే నొనరించు సత్కృతి • నెల్ల సిద్ధినొనర్పవే॥

క. ఈశ్వర నేనిదె నీప్రా
ప్రాణేశ్వరి కాయుమకు త్రిభువ • నేశ్వరికిని రా
జేశ్వరికి నొసఁగ నెంచితి
శాశ్వత నక్షత్రమాల • సదయసుశీలా॥

గీ శాశ్వతైశ్వర్యసంతాన • జయసుఖములు
నయమునాకీడ యాచంద్ర • తారకముగ
నీకృతిని బోను భారంబ • దెల్ల నీది
త్రిపురకాండ వేశ్వర! శర్వ! • దేవదేవ॥

గీ. తల్లికినిఁ దండ్రికి కాత్మ్యరం • జిల్లఁ బ్రణుతిఁ
జేసి యత్తమామల భక్తి • చేసఁ బొగడి
నామనోజ్ఞాగ్య గుడిపూడి • రామమూర్త్యాఖ్య
పాదపద్మంబులాత్మలో • పాదుఁగొలిపి॥

క. పొంగారు భక్తి దనరఁ జె
లంగుచు నక్షత్రమాల • లలితాంగికి, మా

తంగికి, శ్రీశంకరు న
ర్థాంగికి, రాజేశ్వరికిని, యర్పణ జేతుఁ.

క. అర్పించెద, విమలయశో
కర్పూరచ్ఛన్నదశదిఁ గంతకుసుమకుఁ
నేర్పున మృదువాక్తతిచే
గూర్పగ నక్షత్రమాల కోమలమగుటన్॥

త. అర్థేందు విభూషణికిని,
యర్థేందు సమాననిటల కలివేణికి, స
ర్వార్థ ప్రద కామగసం
ప్రార్థితకామావజిత మహిషాసురకుమనున్॥

క. తల్లికి, నాశ్రితకల్పక
వల్లికి శ్రీతాండవేశ బాహుయుగస్తం
భోల్లసితాలింగిత భుజ
వల్లికి, రాజేశ్వరికిని నారాహింకృకన్॥

శా. శ్రీరాజిల్లు భవన్మహామహిమనా చిత్తంబునందెన్నగా
నో రాజానన నావశంబగునె యో హోదేవతాచార్యు
డింకా రాజీవభవుండు నేరడనఁగా నాభ్యాసు రేంద్రార్చితాం
శ్రీరాజన్నవరత్నకుండలధరా శ్రీరాజరాజేశ్వరీ॥

శ్రీ తాడేపల్లి నివాసినీ శ్రీరాజరాజేశ్వరీ దేవతాభ్యాంనమః

శ్రీరస్తు

# శ్రీ రాజరాజేశ్వరీ శతకము

సీ॥ శ్రీకర నీదుసు ♦ శీలత్వమాహాత్మ్య
మరుదానుఁ దలప నె ♦ ట్లన వినుము
పులితోలు మెడడాలు ♦ తలఁపుత్రాగల కేలు
పాపపేరులచాలు ♦ బఱగువాని
నద్రిగుహావాసి ♦ యై యాదిభిక్షుఁడై
యుగ్రుఁడై భీముఁడై ♦ యొప్పువాని
కాలకాలుండౌచు ♦ కామాంతకుండౌచు
నగ్నినేత్రంబుతో ♦ నలగువాని
యోగియై సంగమ ♦ త్యాగియౌచు స్మశాన
వాటి భూతాళితో ♦ వరలువాని
గీ॥ వలచి వలపించితివి గదే ♦ దలఁప నెంత
వారి క్షేత్రజ్ఞ మది నల ♦ వడునె నీకు
నలవిఁగానట్టి కార్యముల్ ♦ గలవె దయను
రాజరాజేశ్వరీ నన్న ♦ రయ

సీ॥ నవరత్నమయభూష ♦ ణంబులా నాస్తి గు
దా,క్షపేరు లెగదా ♦ దాల్చుటకును
ఘనకుసూలంబులా ♦ కట్టవయ్యె వ్రాఘ్రాజి
నం బెగా గట్టుట ♦ కంబరంబు

# శ్రీ రాజరాజేశ్వరీ శతకము.

ఉగ్రాగ బాతియునాస్త్రి ♦ తలపుతెియేగదా
వల్లకాటనెగదా ♦ వాసమలయ
రసికతయానున్న ♦ రౌద్రమూర్తి యెగదా
శయనింపఁగా గజ ♦ చర్మముఁగద
గీ॥ హారములు ఘోరసర్పంబు ♦ లట్టిపేద
యైన యుగ్రాత్మునర్థాంగి ♦ వౌట లోక
మాన్య నీదు పాతివ్రత్య ♦ మహిమగాదె
మించి భక్తిని శివుని పూ ♦ జించినావు
రాజరాజేశ్వ యతీ♦ రాజవంద్య॥

సీ॥ పరికించిజూచితే ♦ పద్మాయతాక్షి నీ
భుజశాఖ శ్రితకల్ప ♦ భూజశాఖ
భావించితే భళా ♦ పద్మాక్షి నీ కటా
క్షంబు సుధాప్రవా ♦ హంబుగాదె
ఘనవిపద్వార్ధి ♦ కడముట్ట దఱియింప
జెలువైన తరణినీ ♦ సేవగాదె
తలపోయఘనదుఃఖ ♦ తమసంబునకు సాంద్ర
చంద్రికల్ నీదు హా ♦ సంబుగాదె
గీ॥ అఖిలవిద్యల కాజ్ఞవీ ♦ వఱసిచూడ
నఖిలరోగంబులకు నౌజ్ఞ ♦ వగుదుగాదె
సజ్జనావళి కెన్న సం ♦ పజ్జయుదవు
రాజరాజేశ్వరీ శైల ♦ రాజతనయ॥

సీ॥ సకలకళావిలా ♦ సముల లోకఖ్యాతి
దీపించు శారదా ♦ దేవివీవు
అణిమాదిఘనతరా ♦ ష్టైశ్వర్యములనొప్పి

# శ్రీరాజరాజేశ్వరీ శతకము.

దీపించు పార్వతీ ♦ దేవివీవు
వనజాక్షునురమున ♦ వసియించి శ్రీవైభ
వములచే నొప్పారు ♦ కమలవీవు
ఘనకదంబవనస్థ ♦ లిని సురల్నుతిసేయ
దీపించు కాళికా ♦ దేవివీవు
గీ॥ తలప మహిషాసురేంద్ర మ ♦ ర్దనివి నీవు
ఘనకళాచతురవును శృం ♦ గారశాంత
మూర్తివి ప్రసాదమూర్తివి ♦ ముగ్ధవీవు
రాజరాజేశ్వరీ గజ ♦ రాజయాన॥

సీ॥ శివనిందకోర్వక ♦ శివుని బాయఁగలేక
తనువుఁ బాసిన దక్ష ♦ తనయవీవు
జగదుద్భవంబును ♦ సలుప కారణమౌచు
బఱఁగుచుండెడి మూల ♦ ప్రకృతివీవు
అఖిలలోకములు మో ♦ హంబుఁదగఁ జేసి
యాడించు యోగమా ♦ యవునునీవు
అవ్వల నాముగు ♦ రయ్యలఁగని బ్రకా
శంబు నందెడు నాది ♦ శక్తివీవు
గీ॥ మదిఁదలంపఁగ నీ లోక ♦ మాతవీవు
గూఢిసేయగ నోంకార ♦ గూపివీవు
యోగిఁవి ఘనసంగమ ♦ త్యాగివీవు
యోగ విద్యారతవు ఘన ♦ భోగివీవు
రాజరాజేశ్వరీ సుర ♦ రాజవంద్య॥

సీ॥ అర్ధేందుపటలంబు ♦ నపహసించెడు ఫాల
ఫలకంబు సొగ సాత్మ ♦ దలఁచి దలఁచి

బాలచంద్రికలను ♦ బరిహాసించెదు మంద
హాసంబు మదిలోన ♦ నరసి యరసి
ధవళాబ్జములకాంతి ♦ తారుమారుగఁ జేయు
సోగకన్నుల హొయ ♦ ల్జూచి చూచి
అఖిలజగన్మోహ నం ♦ బైన నీదు లా
వణ్యాబ్ధిఁ దేలఁగా ♦ వాంఛఁ జేసి
గీ॥ జపతపముని యోగివే ♦ సంబునూని
హరుఁడు గిరిరాజపుత్రిఁ జేరె ♦ నపుడుఁగాదు
అఖిలాత్మజ్ఞానతోషి నై ♦ యట్టిజోగి
నీవు వరియించు టాశ్చర్య ♦ మో వరాంగి
నీమనోనిశ్చయంబిక ♦ నేమనందు॥
రాజరాజేశ్వరీ మృగ ♦ రాజమధ్య॥

సీ॥ శ్రీరాజరాజేశ్వరీ తొల్లి యవతార
మందు దక్షాత్మజ ♦ వైననాడు
దక్షాధ్వరంబున ♦ తనువుఁ బాసిననాడు
పూని రాపట్టివై ♦ పుట్టునాడు
కన్నెవై హిమవన్న ♦ గము పొంత శుశ్రూష
జేయుచు శివునిఁ బూ ♦ జించునాడు
బాలత్వమందునే ♦ పంచాగ్నిమధ్యను
జేరి ఘోరతపంబుఁ ♦ జేయునాడు
అరయ నీమనసు హాయ ♦ బ్రహ్మచారియై
శివుఁడు నీచెంతకుఁ ♦ జేరునాఁడు
గీ. వచ్చి కపటపు విపరీత ♦ భాషలాడ
ఖంచు కినుకను బట్టకే ♦ ట్టించునాఁడు

గీ. నీదు పాతివ్రత్య సుతపో ♦ నిష్ఠయే మొ
నీదు ప్రజ్ఞయొ మహిమయో ♦ నీ యమేయ
భవ్యసౌందర్య పటిమయో ♦ భాగ్యమే మొ
యోగియే భోగియాయెనో ♦ హా! తలంప
రాజరాజేశ్వరీ మృడు ♦ రాజవదన.

సీ. బహుళశక్తియుతవై కృ ♦ పాణపాణివినుత
వాణీ విప్రనుత గీ ♦ ర్వాణివగుచు
చండాయుధయుత దో ♦ ర్దండసహస్రవై
చండివై మహితకో ♦ దండమూని
కాళివై కరధృతశూలి ♦ వై పటుశౌర్య
శాలివై శుభ్రభా ♦ మాలివగుచు
సురవందనీయవై ♦ శూరాగ్రగణ్యవై
సజ్జనాళికి సుఖా ♦ స్పదవునగుచు
గీ. ధైర్యగాంభీర్య సాహసౌ ♦ దార్యమొప్ప
సింహవాహనివై సుప్ర ♦ సిద్ధలీల
భండదానవ సేనల ♦ చెండినావు
శ్రీమతీ రాజరాజేశ్వ ♦ రీ వరాంగి॥

సీ॥ రహిమించు కాలభై ♦ రవ ఘుర్ఘురారావ
మఖిల దిశాంతంబు ♦ లాక్రమింప
ఘన మొప్ప ఖణిఖణి ♦ ల్లని రంకెవైచుచుఁ
గాలుఁద్రువ్వుచు నంది ♦ కదలిరాఁగ
బ్రహ్మాండ భాండంబు ♦ పగులఁగా మహిటాట్ట
హాసంబుతో చండి ♦ యఱుగుదేర
దనుజేంద్ర సైన్యంబు ♦ తత్తరంబందఁగఁ

బేర్చి యార్చుచు వెంట ♦ భృంగినడువ
గీ॥ చటుల ఖడ్గత్రిశూలాది ♦ సాధనములు
దాలిచి సహస్రభుజవాహు ♦ దర్ప మెప్ప
మించి భండాసురుని గండ ♦ డంచినావు
రాజరాజేశ్వరి మృగ ♦ రాజవాహ॥

॥ ఒకవేళ విస్మయం ♦ బొకవేళ వీరంబు
నొకట గృపారసం ♦ బొలుకుచుండ
ఒకవంక ప్రమథులు ♦ నొకవంక దైత్యులు
నొకవంక దేవతా ♦ నికరములును
కంకణ ఝుంకార ♦ ఘనధనుష్టంకార
దనుజ హాహా నినా ♦ దములు సెలగ
బాణవర్షంబును ♦ ప్రసవ వర్షంబును
రాక్షస రక్తన ♦ ర్షంబుగురియ
గీ॥ సురలు పొగడగ ప్రమథులు ♦ స్తుతులుసేయ
దనుజభామినులార్తులై ♦ తత్తరింప
మహిషదానవుఁగూల్చిన ♦ మహితమూర్తి
రాజరాజేశ్వరి ♦ మదమరాళగమన॥

సీ॥ అణిమాది ఘనతర ♦ మైశ్వర్యదాయినీ
విక్రమార్కుండు సే ♦ వించెనిన్ను
అఖిల విద్యాదాయి ♦ వగు నీదుపాద ప
ద్మములు భక్తిని కాళి ♦ దాసుగొలిచె
బహుతరోన్నత వైభ ♦ వ ప్రదాయిని నీదు
రాజితాంఘ్రులు భోజ ♦ రాజుగొలిచె
సర్వతోభద్ర వి ♦ జయకారిణీ శివా

జీ వీరవర్యా డ ♦ ర్పించెనిన్ను

గీ॥ మించి ఘనులెల్ల పూజఁ గా ♦ వించినార
లఖిల లోకైకమాతవు ♦ సలకనికర
జితమధుకరకదంబ ని ♦ ర్జిత దనుజక
దంబ సద్గుణ నికురుంబ ♦ ధన్యమూర్తి
శ్రీ రాజరాజేశ్వరీ కవి ♦ రాజవినుత

సీ॥ అంబనీవు బలిప్రి ♦ యవటంచు మూఢులు
సాధుజంతువులను ♦ జంపుచుండ్రు
బలియనఁగా పూజ ♦ పసుపు కుంకుమ పూలు
ఫలము లర్పణ సేయ ♦ వలెనుగాని
సాధు మానవవు స ♦ జ్జనవంద్య వఖిల పం
చత్కారిశివి కృపా ♦ పరవు నిఖిల
జీవులకూర్మి ర ♦ క్షించు నీపేరట
జీవహింసనొనర్చ ♦ చెనఁటినరుల

గీ॥ యజ్ఞతను బాపి జ్ఞానోద ♦ యంబొనర్చి
భవము లెడబాపిపె మాయ ♦ బాయజేసి
మురసి రక్షింతునుసుమ్ము లో ♦ కైకమాత
రాజరాజేర్వరీ దివ్వ ♦ రాజకీర్తి

సీ॥ పరమేశ్వరుఁడు గురు ♦ భావంబుతో శిష్య
భావంబుతో నీవు ♦ భక్తి మెఱసి
రామతారక మంత్ర ♦ రాజంబు నుపదేశ
మందుట నీకొఱ ♦ కనఁగ బుధు
మది నెన్నఁగా తెరోగ ♦ మాయచ్ఛ చిచ్ఛక్తి
వైన నీవెరుఁగని ♦ యట్టిదున్నె

లోకరక్షణతంత్ర లోలాత్మ వృషదయా
మతివి నీవగుటచే మధురఫణితి.

గీ. కేరిమూర్ఖులదరియింపఁ జేయుఁగోరి
పటిమతారకమంత్రసద్భావమెల్ల
ప్రకటనమొనర్చితివిగదే భయవిదూర
శ్రీకరీ రాజరాజేశ్వరీ భవాని.

సీ. రామతారకమంత్రరాజంబు భవతరు
వారంబునకును కుఠారధార
రామతారకమంత్రరాజంబు షడ్వర్గ
భూధరంబులకు దంభోళిధార
రామతారకమంత్రరాజంబు తాపత్ర
యాగ్నులకెన్నఁగా నంబుదంబు
రామతారకమంత్రరాజ మెన్నంగ దుః
ఖాంబోధికిని బడబానలంబు

గీ. మదనభూతంబువదలించు మంత్రమాచు
వెలయు రామనామంబు నీ విమలహృదయ
రాజతాంభోజముఖ భృంగరాజ మయ్యె
శ్రీసమర్పితరాజేశ్వరీ మృడానీ.

సీ. వెలిదమ్మి రేకులై తలప కెందమ్ములై
మెఱయు నీ చేఱలదీరు కనులు
అరయ రాకాచంద్రుఁడై గ్రీష్మమధ్యాహ్న
భానుఁడైయొప్పు నీ యాననంబు

వల్లకీనాదమై ప్రళయాంబుదరవమై
బఱగు నీవాక్ప్రపంచమఱయ
రాజిల్లుకృపతోడ రౌద్రంబుతోనొప్పు
నిరుపమానస్ఫూర్తి నీదుమూర్తి

గీ. తలఁప ప్రియదాయియును భయదాయియౌను
సాధుమానసులైన సజ్జనులకెల్లు
దుష్టవర్తనులైన ధూర్తులకునెల్లు
నీశుభాకృతిదోఁచు నిర్నిద్రతేజ
శ్రీమతీ రాజరాజేశ్వరీ నమోస్తు.

సీ. రథమునడుపుటయును రణతలంబునఖడ్గ
హస్తయై రిపుల జెండాడుటయును
కవనంబుఁజెప్పుటఁగానంబొనర్చుట
భరతశాస్త్రప్రౌఢి బడయుటయును
చిత్రలేఖనమాది చెలఁగు చతుష్షష్టి
కళ లభ్యసింపరే కాంతలెల్ల
యజ్ఞంబొనర్ప వేదాధ్యయనమొనర్ప
నుపనిషదర్థంబు లుగ్గడింప

గీ. నన్నిటను ప్రజ్ఞఁగలదు మున్నతివలకును
యిపుడు స్త్రీవిద్యయే నశియించెనమ్మ
యెల్లవిద్యలు మఱల మాకీగదమ్మ
యన్నికళలకు లక్ష్యమీవౌదువమ్మ
అమ్మ రాజేశ్వరీ సకలార్థదాయి.

సీ. ప్రణయసందర్భ నిర్భరరాగమానస
గరకంఠఫాల సంఘటితమగుచు
మాణిక్యమయహేమ మంజీరనినద రం
జితఫాలలోచన చిత్తమగుచు
శారదామ్మృదుహాస్త జలజాతచర్చిత
కలితరాగారాగ కాంతమగుచు
కమలాలయాహస్త కంజాతరాగస
మ్మానితోన్నత మహామహిమమగుచు
గీ. చెలఁగి తగునారుణచ్ఛాయఁ జిక్కఁబఱచు
నఖిలసజ్జనఘనవిపదబ్ధిపోత
నీపదాబ్జాతయుగ మాత్మ నెదలంతు
రాజరాజేశ్వరీ సర్వరాజవేశి.

సీ. ఫాలతిలకంకరుమేనఁబూయు భూతియె నీకు
ఫాలుపొంపు గంధంబు పూతయయ్యె
పశుపతిదాల్చు సర్వవిభూషంబులే
రాజిల్లు స్వర్ణస్వరంబులయ్యె
మహాత్ముండుదాల్చిన రుద్రాక్షమాలలే
రహిమించు తారహారంబులయ్యె
హరుఁడుండు కైలాసగిరికందరంబులె
ఒంపైన యంతఃపురంబులయ్యె
గీ. నీదుపాతివ్రత్య మహిమారె నెలతలకును
విభునితో లేదు తలపోయ వేదటికము
ననెడునీతి బోధించితివమ్మ ఘనులు

జరిపిజూపుదురితరుల జరుపుఁడనుచు
సతతమునుబోరిచెప్పగా సాగుచుండి
రాజరాజేశ్వరీ హేమరత్నభూష.

సీ. సామగానంబు నుచ్చైస్వనంబున వీణె
పై మేళవించుచు భారతియును
మధుకరధ్వనులొప్ప మహితాబ్జములను వే
ణి నలంకరించుచు వనజపాణి
తిలకంబు నుదుటను దీర్చి ముకురము నీ
కెదుటజూపుచు నామహేంద్రురాణి
ఘనహేమదండసంకలితవింజామరం
బునువీచుచు ధనాధిపునిసతియును.
ఘనభూషణములు నీతనువల్లికను పొందుఁ
బఱచుచు నెల్లదిక్పాలసతులు

గీ. చేరి ఘనభక్తివివిధోపచారములునుఁ
జేయుచఖిలామరాంగన ల్చేరికొలువ
వెలయునీ వైభవస్ఫూర్తి వినుతిఁజేయ
నలవియే నలువకునైనఁ జెలువకైన
రాజరాజేశ్వరీ లోకపూజనీయ

సీ. ఒకవంక చోరబాధకు నోర్వఁజాలక
నొకవంక కఱవున కోర్వలేక
నొకవంక నానావిధోగ్రరోగంబుల
పటుబాధలకులోఁగి బ్రదుకలేక

కుడువకూడును గట్టగుడ్డయు లేక మా
నమము కాపాడుకొనుటకు లేక
మానవంతులు దుఃఖమానసులై కష్ట
పడు బీదసాదల బాధలెల్ల
గాంచజాలకయును గడఁగిసాయముఁజేయ
శక్తిలేకయు మది సంకటమున
గీ. జింతిలుచునుండిరి సుజనుల చిక్కులెల్లఁ
బాపిదీనులరక్షింప బ్రాభవమిడ
నీవుమదిలోనఁదలఁచిన నేరవొక్కొ
రాజరాజేశ్వరీ జగత్ప్రదితచరిత.

సీ పరులొంకు దారిద్ర్యబాధఁదీర్పఁగనెంచు
నుపకారులకు ధనం బుత్తదగును
ఘనధనవంతులై గ్రాలువారలకు గ
ర్వాంధతచే దయ యనఁగనున్న
ధనవంతులందొక్క దాతయుండును దీను
లందఱ నెట్లొక్క డరయగలఁడు
ధనవంతులందఱు దయఁగలవారైన
దీనులకష్టము ద్దీరవొక్కొ
గీ. దీనసజ్జనకష్టము ల్దీర్చుటకును
దుష్టచిత్తుల సుగుణవంతులను జేయ
భాగ్యవంతుల ఘన దయావంతులనుగఁ
జేయునేరుపులన్ని నీ చేతఁగలవు
రాజరాజేశ్వరీ భక్తరాజపోష.

# శ్రీ రాజరాజేశ్వరీ శతకము.

సీ. భాగ్యవంతుండైన పరగఁబీదలఁజూచి
యాదరింపకఁజాల నపహసించు
బలవంతుడైనచో బలహీనులనుజూచి
సమయించుగాని తా జాలిఁగొనఁడు
అధికారియగు నేని యనుచరులనుఁజాల
గష్టపెట్టునుగాని కరుణఁగొనఁడు
అమిత విద్యావంతుఁడైన గర్వాంధత
పరమసాధులతోడ పలుకఁబోడు

గీ॥ అల్పమతియును దుష్టాత్ముఁ ♦ డైనవాని
కున్నతస్థితిఁగల్గ ♦ నిట్లుండునట్టి
వానిచే లోకముద్ధరిం ♦ పంగఁబడదు
గాన గుణవంతుఁ జేయుమా ♦ వానినీవు
రాజరాజేశ్వరి దైత్య ♦ రాజహారి॥

సీ॥ ధనవంతుఁడే మహా ♦ దాతృత్వమతియైన
పూవుదావియునొప్పు ♦ పోల్కెఁగాదె
బలవంతుఁడే కృపా ♦ పరతంత్రుఁడైనచో
మణిహేమ మందొప్పు ♦ మాడ్కిఁగాదె
అధికారి న్యాయంబు ♦ ననుసరించి జరింప
ఫలమందు రుచియొప్పు ♦ పగిదిగాదె
వినయసంపన్నత ♦ విద్యాధికునకున్న
నెలయు వెన్నెలయట్టు ♦ లలరుగాదె

గీ॥ అఖిలసుగుణము లొక్కచో ♦ నమరఁజేని
యలహరిశ్చంద్రురీతి లో ♦ కాభినుతుఁడుఁ

గాఁడె పురుషుండు లేకున్న ♦ కఠినదైత్య
పతులవలె నైభవస్ఫూర్తిఁ ♦ బడయు నేమి
బలసి జగములచేఁ దిట్లు ♦ బడెఁడు నేమి
చాన రాజేశ్వరీ సామ ♦ గానలోల॥

సీ॥ దయయు సత్యంబును ♦ దాతృత్వభావంబు
వెలది యం దెప్పుడు ♦ వెలుఁగవలయు
పరహితభావంబు ♦ బంధుపోషణమును
కాంతలయందునే ♦ గ్రాలవలయు
కరుణయు శాంతంబు ♦ కలితమర్యాదయు
గృహిణి యెప్పుడును వ ♦ హింపవలయు
నోర్పును కలిమిడి ♦ యొప్పు తియ్యనిమాట
పతివాంఛ దెల్లప్పు ♦ డెఱుఁగవలయు

గీ॥ ఆపదలవేళ ధైర్యంబు ♦ నుండవలయు
సంపదలవేళ ప్రేమయు ♦ జాలి దీన
జనులఁ బ్రోవఁగ మది మెత్త ♦ దనము వలయు
సతులు సన్మార్గమందునఁ ♦ జనఁగవలయు
నిట్టి సుగుణము లింతుల ♦ కీఁగదమ్మ
రాజరాజేశ్వరీ విఘ్న ♦ రాజమాత॥

సీ॥ భృత్యుల తాగన్న ♦ బిడ్డలవలెఁ గష్ట
సుఖములారసి ప్రేమఁ ♦ జూడవలయు
అతిథులఁగని భక్తి ♦ నల దైవసములంచు
వేడ్కతో పూజఁ గా ♦ వింపవలయు

బంధులఁగని ప్రేమఁ ♦ బాటిల్ల గౌరవ
భావయై సత్కరిం ♦ పంగవలయు
గర్వంబు విడనాడి ♦ కడు దీనజనులను
చెలఁగు వత్సలత బో ♦ షింపవలయు

గీ॥ దానధర్మంబుఁ జేయఁగాఁ ♦ దలఁపవలయు
కలిమిఁ గలిఁగిన ఫలమేమి ♦ తలఁపసతికి
గుణము గలిగిన వన్నె గ ♦ ల్గునుఁ దలంప
గృహము దిద్దుచు పతికి స ♦ త్కీర్తి దెచ్చు॥

గీ॥ గృహిణి గావునను గృహస్తు ♦ గేహినికిని
తెలిసి మంచిగుణములు బో ♦ ధింపవలయు
యిట్టిగుణములు మనుజుల ♦ కీగదమ్మ
గౌరి రాజేశ్వరీ శ్రిత ♦ కల్పవల్లి॥

సీ॥ నారాయణుని దివ్య ♦ నామంబు వీణపై
మీటి నారదుఁడును ♦ మెఱసిపాడ
ఘనకాలమ్మాన స ♦ క్రమముతోడ మృదంగ
మోచి విష్ణుండు వా ♦ యించుచుండ
ఒకవంక పద్మజుఁ ♦ డకలంకచిత్తుడై
వేడ్కతో తాళంబు ♦ వేయుచుండ
నిందాది దిక్పాలు ♦ లెల్లగు సభ్యులై
యింపుమీరంగ వీ ♦ క్షింపుచుండ
తాండవ ప్రియుడై న ♦ తాండవేశ్వరుఁడు నా
నందంబుఁగూడ తాం ♦ డవముసలుప

గీ॥ అరసి యానందరసమగ్న ♦ వౌచునీవుఁ
గాంచి పులకించి శిరము పం ♦ కించి బావు
రే యటని మెచ్చి పరవశీ ♦ తేంద్రియవగు
నీ స్వరూపంబెదోచు నా ♦ నెమ్మనమున॥

గీ॥ నీ శుభాకృతి నామది ♦ నిలుపవమ్మ
అట్టియానందమునె యిం గ ♦ దమ్మ మాకు
నిఖిలలోకాళి నీయాజ్ఞ ♦ నిలుచునమ్మ
తల్లి రాజేశ్వరీ గుణ ♦ ధన్యమాన్య॥

సీ॥ గరిమతో బాలాత్రి ♦ పురతాండవేశ్వరుఁ
డానందమున నాట్య ♦ మాడుచుండ
జూచి పరవశత ♦ స్రుక్కి సోలిన నీవు
హరుని సంతోషాట్ట ♦ హాసరవము
నాలకించియు బహ్కృతి ♦ నందిన నీవిలా
సము నీదు శృంగార ♦ రమనఁగాంచి
యద్భుతరాగర ♦ సావేశమగ్నుఁడై
యాత్మరంజించు న ♦ య్యభవునిట్టు

గీ॥ లనుదినము రంజిల్లఁగఁ జేయు ♦ నట్టి రసిక
మతివి నోహైమవతి గుణ ♦ వతివినీవు
నట్టియానందమే యీగ ♦ దమ్మ మాకు
శ్రీకరీ రాజరాజేశ్వ ♦ రీ దయాళు॥

సీ॥ చెఱుకుపల్లి కులాబ్ధి ♦ శీతకరుండైన
వేంకయార్యుఁడు తత్త్వ ♦ వేత్త ఘనుఁడు
అద్వైతశీలుండు ♦ నతిభక్తిపరతంత్రుఁ
డార్యవందితుఁడును ♦ అనఘమతియు
నుత్తముండు దయాను ♦ యుండు నిర్వైరి స
త్యవివేక ధనుఁడు స ♦ త్వగుణసిధియు
వైదికాగ్రణియును ♦ పరమార్థపరుఁడుతా
డేపల్లి సంవాసి ♦ యొదయుఁభక్తి

గీ. పటుమహాత్మ్యంబుదనర ♦ స్థాపనముఁ జేసె
పరగతాడేపల్లిపుర ♦ వరమునందు
మొనసియాచంద్రతారార్క ♦ ముగనునిన్ను
రాజరాజేశ్వరీ హీర ♦ రమ్యకీర్తి.

క. ఒకవంక ♦ త్రిపురసుందరి
యొకవంకను రాజేశ్వరి ♦ యొప్పుచునుండన్
ప్రకటముగనొప్పు శంకరు
డకలుషమతినూకునిడుఁ ♦ భైశ్వర్యంబుల్.

గీ. మహితభక్తిని నక్షత్ర ♦ మాలనేను
రాజరాజేశ్వరికి నిదే ♦ రాజిలంగ
నిపుడెయర్పించిని తాండ ♦ వేశ్వరుండు
పరమదయమమ్ము గృతినిఁ ♦ గాపాడుఁగాక
ధరణి నాచంద్రభాస్కర ♦ తారకముగ.

## శ్రీ రాజరాజేశ్వరీ శతకము.

ఉత్సాహ

మంగళంబు తాండవేశ సహితపాదయుగళికిన్
మంగళంబు సర్వలోక మాన్య త్రిపురసుందరీ
మంగళంబు లోకములకు మాకు శుభములీగదే
మంగళాంగ శ్రీనృసింహ మాల్యశైలమందిరా.

క. తాడేపల్లి నివాసులు
నోడక శతము వ్రాయుట్టు లొప్పుగ గనుచున్
వేడుక దీవిరచింపగ
కూడిన ప్రేమమున నన్ను గోరుట చేతన్

గీ. పటిమహృదయేశు డుత్సాహ బలిచి యెల్ల
వేళలందున విశ్రాంతి వెలయజేయు
గురుజనులు ప్రీతమతులౌట కొర్కెదీర
రాజరాజేశ్వరి కిదియ ర్పణము జేసి
నాను గోపాలబాలుడ యానుతిని.

గద్య

ఇది శ్రీమాల్యశైల నృసింహ వరప్రసాదసమాపాదిత సకలశాస్త్ర సంవిమసంస్కృత సరససారస్వత సంస్కృతాంధ్ర సాహితీసరస్కృత చతురవాగ్ధోరణిమతుకుమల్లి కులమ తల్లి హాజవల్లికావియన్నణి నృసింహవిద్వన్మణి ద్వితీయపుత్రి విభుతమిత్రనరహార్యత్సురాయ శాస్త్రి యనంతలక్ష్మంబికాద్వ

## శ్రీ రాజరాజేశ్వరీ శతకము.

న్వయగర్భశుక్తి ముక్తారత్నంబును గుడిపూడ్యన్వయక్షీరపారావారరాకాసుధాకర వేంకటరాయామాత్య యుగంధరనాగమకాంతామతల్లీ ప్రేమైకపుత్రి సుజనమిత్రి రామరాయధర్మపత్నియు నైన యిందుమతీ ప్రణీతంబైన రాజరాజేశ్వరీనక్షత్రమాల సంపూర్ణము.

శ్రీ రాజరాజేశ్వరీ దేవతార్పణము.

శ్రీ సుజనరంజనీ ముద్రాక్షరశాల — రాజమండ్రి.